ఓం

శ్రీపరబ్రహ్మణేనమః.

# శ్రీమద్విశ్వకర్మచరిత్రాన్వయదీపిక.



ద్వి. శ్రీపార్వతీపుత్ర ♦ చిన్మయానంద
నామాత్మయందున ♦ నమ్మికగొలుతు
మానసంబునపూజ ♦ మహానీయ్యముగ జేతు
స్నానమాచరించి ♦ సన్నుతింతు
వస్త్రయుగ్మంబుల ♦ వసుసశోదాలుతు
పుష్పగంధాక్షతలు ♦ పూజసేతు
శర్కరఫలములు ♦ శాంతిగానర్పింతు
ధూపదీపానక ♦ దోహదములు
ప్రణుతిజేసెదసాష్టాంగ ♦ ప్రాజ్ఞతిగను
విఘ్నరోగుమరక్షించు ♦ వినుతుజేతు
నంచునుతియింతువేల్పుల ♦ కాదిమూర్తి
భక్తజనపాలగణపతి ♦ భవ్యచరితా. 1

గీ. విఘ్నపతికి మ్రొక్కి ♦ విఘ్నంబు లేకుండ
నిగ్రహింపవలయు ♦ నేర్పుతోడ
శీఘ్రముగను గ్రంథ ♦ సాంగంబు జేయుమి
విశ్వకర్మకర్త ♦ విమలభర్త. 2

సీ. వాగ్దేవతానాదు ♦ వాక్కునసందుండి
వాగ్దుకీర్ఘుకి ♦ వాక్కునిమ్ము
నీకటాక్షము చేత ♦ నేర్పులన్నియు నిచ్చి
గ్రంథసాంగంబును ♦ గలుగ జేయు
సకలశాస్త్రంబులు ♦ చదివిచూడగ లేదు
ప్రకటితసాహిత్య ♦ బలము లేదు
అమరకాండత్రయం ♦ బరసి చూడగ లేదు
పంచకావ్యశ్లోక ♦ పఠన లేదు
నీకృపచేతను ♦ నీగ్రంథమును నేను
ప్రారంభమును జేయు ♦ ప్రాజ్ఞతగను
తల్లిరక్షించుతనయుని ♦ ధన్యు జేయు
ఆయురారోగ్యసంపన్ను ♦ సమను జేయు
పరమకళ్యాణిశుకవాణి ♦ బ్రహ్మరాణి. విశ్వ 3

కం. శివకవులను ♦ హరికవులను
భువిలోపల బ్రహ్మకవుల ♦ బ్రస్తుతి జేతున్
వివరించినిందుపదముల
చవిగొనుమీ భువిని జనులు ♦ చక్కగ నిపుడున్. 4

గీ. భద్రకాళీశ శ్రీవీర ♦ భద్రమూర్తి
యింటివిలవేల్పు నెప్పుడు ♦ యిష్టశుద్ధి
యిచ్చి రక్షించు నామది ♦ నింపుమీర
పరమకళ్యాణి శ్రీవీర ♦ భద్రరాణి. 5

వ. అట్టివీరభద్రస్వామికి, అనేకపరియాయమ్ములు, సాష్టాంగదండప్రణామంబులం జేసి మానసపూజావిధానంబులాచరించి కొన్ని మతగ్రంథమ్ములు పరిశీలించి అందున్న సారాంశంబులు కొన్ని తీసుకుని వేదవాక్యములు పుష్పమాలికగా పద్యరూపంబున మహాప్రబంధంబుగ ప్రపంచములో యెనబైనాల్గులక్షల జీవరాసులలో మానవులకు ఖర్మములున్ను కర్మలకున్ వృత్తులున్ను వృత్తులకు ఉపకరణాదులున్ను యిచ్చి పోషించుటకు గ్రంథమూలంబుగా రచియించి సమర్పించిన కథా ప్రారంభెట్టిదనిన

సీ. మూడక్షరంబులు ♦ మొలయకుండెడునాఁడు
మూడుగుణంబులై ♦ మొలచినాఁడు
పంచభూతములును ♦ ధ్భవముపొందనినాడు
పంచతత్వంబులై ♦ ప్రబలినాడు
షడ్దర్శనంబులు ♦ జననమొందనినాడు
షట్కర్మతతినివి ♦ స్తరలినాడు
దశదిశాంతరమువి ♦ స్తారమొందనినాడు
దశవిధప్రాణముల్ ♦ దాల్చినాడు
నేడునేవిం టివిశ్వేశు ♦ నిగమవంధ్యు
నాత్మనెంచుచునుగ్రాం ♦ చాద్రిభేద
నాటకములెవ్వియును లేని ♦ నాటనుండి
సారసద్గుణహారకు ♦ మారవినుతా. 6

కం. అఅన్నదిమూగాక్షరి
ఊఅన్నదిబిందు ♦ ఉపకారముకై
మఅన్నదిజోలై నది
హాయంబై ప్రణవమయ్యె ♦ ఆనందముతో. విశ్వ 7

గీ. మొదలుప్రణవమాయె ♦ మోదముతోతనువాయె
తనదుసంతతినెల్ల ♦ ధరణియాయె
ఇట్టిమొదలుకన్న ♦ మఱియేది లేదయా. విశ్వ 8

వ. స్వయంభువ ఆయినటువంటి పరంజ్యోతిస్వరూపమైన విరాడ్విశ్వబ్రహ్మమందు అణుస్వరూపమైన వైవస్వతమనువు పుట్టించి బ్రహ్మవిష్ణురుద్ర త్రిమూర్త్యాత్మకమైనటువంటి పంచముఖబ్రహ్మయందు ద్విభుజుడైన విశ్వకర్మ వుదయించి యిచ్ఛామాత్రప్రభూసృష్టిః అనేవేదనియతని ప్రపంచము సృష్టించగలందులకు యిచ్ఛగలవాడై పంచమహాభూతతత్త్వంబులు నిర్మించి విశ్వాంగః కోటిర్విశ్వకర్మాణాం అనేవేదనియతని విశ్వనిర్మాణంబై యొగ్యగలంబులకు కర్మప్రారంభించెను.

సీ. కర్మంబు చేతను • కల్గును భోగంబు
కర్మంబు చేతను • కలుగు శుభము
కర్మంచేతను • కైలాసగిరి కేగి
కర్మంబు చేతను • కష్టపడిరి
కర్మంబు చేతను • కామితార్థముగల్గు
కర్మంబు చేతను • కలిమి గలుగు
కర్మంబు చేతను • కలుగుసుజ్ఞానంబు
కలుగుకర్మచేత • కాయశుద్ధి. 9

శ్లో. విశ్వమూలం విశ్వవృక్షం విశ్వజ్యోతిపరాత్పరం
శిశ్వశాఖోకులోద్భంచ విశ్వకర్మజగద్గురుః. 10

శ్లో. యేకకాలం ద్వికాలంచ యేకఆత్మ ద్వమూర్తిచ
యేక తేజంద్వితేజంచ నాదిమూలంచకారణం. 11

గీ. అసలుకాలము సఖము ♦ నర్థరాత్రియు జేసి
పొసగుమిగిలినసఖము ♦ పగలు జేసి
దివము రాత్రియు జేసి ♦ దివ్యవిశ్వబ్రహ్మ
విశ్వకర్మకర్త ♦ విమలభర్త. 12

గీ. మాఘబహుళచతుర్థి శివరాత్రి ♦ మనువుబుట్టె
ఫాల్గుణబహుళమావాస్యకు ♦ ప్రపంచంబుబక్తిపరచె
చైత్రశుద్ధపాడ్యమికిదివము ♦ తేజరిల్లె
యిట్లుసృష్టిజేసె ♦ విపరీతముగనయన. వి. 13

గీ. వక్కమానములోను ♦ వరుసగాపండ్రెండు
మాసములువత్సరం ♦ భక్తిపరచె
కృతయుగధర్మంబు ♦ కూర్మితోనిర్మించె. వి. 14

సీ. మాయప్రపంచంబు ని ♦ ర్మాణంబు జేయుటకు
మనువుబుట్టెను మాఘ ♦ బహుళమందు
వనరుచతుర్థిశివరాత్రి ♦ వైస్వమతమనువు
శివరాత్రిపురుషుడై ♦ శివుడుద్భవించె

మానసశివరాత్రియని ♦ మహాత్యంబుగల్పించె
జంగమరూపుత్రి ♦ లింగమయ్యె
మూడుబూర్తులకాది ♦ మూలమైవిశ్వజ్ఞ
నామమువహించె త్రి♦ లోచనుండు
యిట్లుసృష్టికర్త ♦ నిహాపారాదులకర్త
దివమునిర్మించిన ♦ దీక్షకర్త
సకలశుభాశుభమునకు ♦సంకల్పమేకర్త. వి.

వ. ఇట్టి పరాత్పరుండైన ప్రణవస్వరూపుండగు విశ్వజ్యోతిస్వరూపమై విశ్వనిర్మాణకర్తయైన వైవస్వతమనువు బ్రహ్మ విష్ణు రుద్ర త్రిమూర్త్యాత్మకమైన విశ్వకర్మ స్వయంభుగా వుద్భవించెను. 16

శ్లో. అనాభికమూలాద్బ్రహ్మ ఆసం శేషవిష్ణుమేవచ
ఆశీరుషే యీశ్వరజ్ఞేయం విశ్వకర్మత్రయీతనుః.

గీ. వక్రవత్సరంబు ♦ వరుసగానిర్మించె
నాల్గుయుగములభువిని ♦ నడపిజేసె
ఆదిమూలకర్త♦ అసలువిశ్వజ్ఞుండె. వి. 17

గీ. అసలునాదికర్త ♦ నాత్మపరబ్రహ్మ
జాతులేసిరెండు ♦ పోర్కజేసె
పోతుపెంటిను జేసె ♦ పొందుగానసృష్టికిని. వి. 18

గీ. విశ్వకర్మసుతుడు ♦ యిలలోనయిూశ్వరుడు
విశ్వకర్మసుతుఁడు ♦ విష్ణువనుచు
విశ్వకర్మసుతుడు ♦ యింద్రాదిదేవతలు. వి. 19

గీ. కళ్ళుచూచుటకును ♦ కాళ్ళునడచుటకును
చేతులు జేయుటకు ♦ చెవులువినుట
మనసుయూహించుట ♦ మర్యాదగల్పించె. వి. 20

గీ. తల్లిదండ్రియు చాల ♦ ధనముసంపాదించి
బిడ్డలు కొసగినను ♦ ప్రేమగలదె
అసలునుజనకర్త ♦ అతీసునేకదా. వి. 21

గీ. యినుముమనువుచేత ♦ నీప్రపంచంబాయె
యినుముమనువుచేత ♦ యుగ[illegible]ంబుట్టె
యినుముమనువుచే[illegible]♦నిహాపరాదులుగల్గె. వి. 22

గీ. దారునను చదెచ్చి ♦ ధ[illegible]నై దున్నుటకు
నాగలనుచుపేరు ♦ నమ్మ[illegible]యుడు
కాయలోహము దెచ్చి ♦ కర్రు [illegible]సినమనువు. వి. 23

గీ. రేకొకముహూర్తంబు ♦ వేక్క[illegible]డుత జేసి
నాగలిపూ[illegible]చి ♦ న[illegible]మొ[illegible]
యీమ్యేటిఫలనాయు ♦ మెట్లుగానుందును. వి. 24

గీ. మృగశిరరాగానె ♦ మూడుధాన్యాదులు
కందిప్రత్తిధాన్యా ♦ కలియబోసి
భూమిమీదనుచల్లి ♦ భూభారమువకును. వి. 25

సీ. గ్రామాధికారులను ♦ ప్రేమతోడుతబిలచి
మనుమయబ్రహ్మలకు ♦ మాన్యమిచ్చె
దయగలిగివలేదు ♦ తమబ్రతుకుటకుగాఁకు
ధనధాన్యపంటలు ♦ పంపుటకును
యిండ్లువాకిళ్లను ♦ వింపైనగృహములు
నిర్మాణకర్తలను ♦ నెమ్మనమున
వడుగులుపెళ్లిళ్ళు ♦ వరుసతోజేసియు
పుడమునిర్మించిన ♦ బ్రహ్మసుతులు
యిట్లుసృష్టికర్త ♦ యనుకొనరుభ్రష్టుజనులు
తిట్టిచేయించుచుందురు ♦ తీవ్రముగను
పెట్టపసలేదుకఠిన ♦ కార్పణ్యమంతా. వి. 26

గీ. మయుడుదారువచేత ♦ మహిమీదప్రజలకు
మహిమచేతనిళ్ళు ♦ మలయజేసె
మాతపితురులుసుతులు ♦ మహారాజగానుంచె వి. 27

గీ. దప్పితాగుటపాత్ర ♦ ధరణిలోనవరిచ్చె
కుడువకంచమునిచ్చె ♦ కూర్మితోడ

వ్రుండనిల్లునిచ్చె • పండమంచమునిచ్చె. వి. 28

గీ. మనువుమయుడు పనులు • మఱిలేకలోకముల
సాగదెపుడుజూడ • సాక్షిగాను
తల్లితండ్రియులేక • తనయులుగల్గునా. వి. 29

గీ. మంగళప్రదమైన • మంగళసూత్రంబు
అంగనమెడగట్టి • టర్ధనేదో
మూడుముళ్లేయుట • మూలంబెయరుగరు విశ్వ 30

గీ. పుస్తెకట్టకముందు • పురుషుడెవ్వండైన
అత్తుకచ్చెబట్టు • టరవాండౌన
పుస్తెకట్టినవెనుక • పురుషునుచ్చెబట్టె. విశ్వ 31

గీ. నమనుభూమిత్రవిప్ర • నలుతట్లగట్టెరి.
చెఱువుత్రవ్వజేయు • శ్రేష్టుడితడు
సప్తసంతతికిని • సంకల్పశిద్ధుండు. విశ్వ 32

గీ. వృత్తిలేనికులము • యుర్విలోనైదుగురు
విప్రక్షత్రియశూద్ర • పంచకులము
వృత్తులున్నకులము • వృత్తమనుకులములు. విశ్వ 33

గీ. వక్రవృత్తిజేసి • వసుధలోబ్రతికినది
నిక్రమైలకులము • నిర్ణయముగ
సకలవృత్తులుసల్ప • సాంకర్యజాతులు. విశ్వ 34

శ్లో. బ్రాంహ్మణో భగవాన్ రుద్రో క్షత్రియో పరమో
హరిః వైశ్యో పితామహశ్చైవ యింద్రశూద్రశ్య
జాయతే. 35

గీ. పంచబ్రహ్మలుకళలు ♦ పంచాంగమును జేసి
మించినరాజులకు ♦ మెచ్చనిచ్చె
మంచిచెడ్డలుజూడ ♦మరివిప్రులకునిచ్చె. వి. 36

సీ. బ్రహ్మపౌరోహితము♦ పంచాగమునుయిచ్చి
గ్రామపౌరోహితము ♦ జేయమనుచు
కరణాలకును కత్తి ♦ ఘటంబులిచ్చియు
ధర గ్రామలెఖ్ఖలు ♦ నరళి వాయ
కోమట్లకునుఖరా ♦ కొలునకుంచమునిచ్చి
అడ్డతవ్వతెక్కె ♦ డమ్చినిచ్చె
కాపులకునుపని ♦ గల్పించిధరణిలో
అవనిదున్నెకొరకు ♦ హలమునిచ్చె
యిట్లుబ్రదుకుదెరువు ♦ యిచ్చినవిశ్వజ్ఞ
పూజసల్పవలయు ♦ పుడమిజనులు.. విశ్వ 37

గీ. యజ్ఞంబుజేసెదరు ♦ యిలలోనద్విజులంత
యజ్ఞపురుషుండెవరో ♦యెరుక లేదు
యరుకెగాయత్రియని ♦ యనిపల్కు వేదములు. వి 38

మొదటిసూత్రతత్వంబు ♦ వదలుటనెటగల్గె
విధిపంచశిఖలుచే ♦ వదలుటాయె
పంచముఖోద్భవుని ♦ పంచసంస్కారములు. వి 39

సీ. తలకాయగొరిగించి ♦ తగపంచశిఖలుంచి
ద్విజులను జేరిరీ ♦ దివ్యగురుడు
పంచముఖోద్భవుం ♦ పంచసంస్కారముల
వంచనవెడలించి ♦ మించనొసగె
మనువుశిల్పకర్మ ♦ మయుడుసంఘంబును
త్వష్టభిక్షుపాత్ర ♦ ముష్టినొసగె
శిల్పిగోముఖమును ♦ చెన్నొందివిశ్వజ్ఞు
చెవులసంస్కారంబు ♦ సంస్కరించె
యిట్లుసూత్రతత్వంబు ♦ వదలించి
విశ్వజ్ఞాదిజులను ♦ వర్థిల్ల జేసిరిలను
ముష్టినెత్తుచు బ్రతకండి ♦ముఖ్యముగ
ఖ్యాతిమెక్కినపంచముఖ ♦బ్రహ్మయతడె.

గీ. రాచపుత్రికిక్కైన ♦ రమ్యముగవిశ్వజ్ఞ
ముక్కుచెవులుకుట్టె ♦ ముందుగాను
ముందురంధ్రమునకు ♦ మోహముట్టుటకొరకు.వి 41

గీ. కుంచకోలను జేశె ♦ గుడిగట్టినొక రాయి
దేముడనుచుజూపె ♦ దేవపలియు
నదియుకడిగినవాని ♦ నర్చకునిగా జేసె. వి. 42

గీ. కంచరచరణముల్ ♦ గైకొని వైష్ణవుల్
విష్ణుపాదుకలని ♦ వెతలఁబెట్టి
నెత్తి మీఁదఁబెట్టి ♦ నెవరు నిర్మించిరో. వి. 43

గీ. త్వష్టపాదుకలనుచు ♦ నిష్టతో నర్చకులు
శఠదపాదుకలని ♦ రూపిగాను
నెత్తి మీఁదనుంచ ♦ నెవరునిర్మించిరో. వి. 44

గీ. ఒక్కరాయితెచ్చి ♦ పనరేగిచీల్చియు
రెండువక్కలుజేసె ♦ దండముగను
పొలువెంటియుజేసె ♦ పొందుగాపెళ్లికిని వి. 45

గీ. విశ్వకర్మకుమాళ్లు ♦ యుర్విలో హరిహరులు
విప్రక్షత్రియవైశ్య ♦ నొప్పుకొనికి
పల్లకీలనుచుంచి ♦ భక్తితో మోశెదరు. వి. 46

గీ. గానుగరోకలి ♦ ఘనసంకె ముసుబల్ల
తేరిలక్కపన ♦ దివ్యములర
నుఫ్వులుదంచుకొని ♦ నూనెలేసుకబ్రతుకు వి. 47

గీ. గుంటరాయినిచ్చె ♦ గుండ్రచక్రమునిచ్చె
కుంభినికుమ్మరుని ♦ కుండ జేయు
కుండ జేసినవాని ♦ కుమ్మరిగా జేసె. వి. 48

గీ. శంకుఘంటయునిచ్చి ♦ జేజేలలనుబోగడ
మెట్టజంగము మెడకు ♦ లింగమిచ్చె
బిచ్చమెత్తుకబ్రతుకు బిరుదుముగనిచ్చె. వి. 49

గీ. దోనెపల్క జేసి ♦ దోవతుల్ నిర్మించ
నాడెముల్లుసూత్ర ♦ నడకచేత
నేతకాండ్లను జేసె ♦ క్ష్మాని విశ్వజ్ఞుడు. వి. 50

గీ. గొల్లలకు కావడి ♦ కొంకికర్రొకటిచ్చి
గండ్రగొడ్డలిచ్చె ♦ ఘనతమీర
చల్లజేయుటకును ♦ చల్లకవ్వమునిచ్చి వి. 51

గీ. గ్రామమున నొకగుడి ♦ ప్రేమతోడగట్టి
గ్రామదేవతయని ♦ నామమిడియె
ఆదేవతనుగొలుచు ♦ టాసాదిగా జేసె వి. 52

గీ. సూదివుంగ్రముకత్తి ♦ సూటిగా నిర్మించి
మేదినిజనులకు ♦ మెచ్చనిచ్చె
దర్జివాళ్లను జేసె ♦ ధరణిలో విశ్వజ్ఞు. వి. 53

గీ. తంటసంబు జేసి ♦ తలగియ్యకత్తిచ్చి
అవని బ్రతుక మనుచు ♦ క్షురకునకు
వృత్తులన్నియునీకు ♦ యుర్విలోపలనిస్తి. వి. 54

గీ. కూడకట్టునుగట్టి ♦ గోచిలోపలబెట్టి
బోడిముసుకువేసి ♦ హరిబొబ్బకొట్టి
మూడుపూళ్లుతిరిగి ♦ ముష్టిసాతానంబు. వి. 55

గీ. హరిగోహరిహరి యనుచు ♦ అక్షయపాత్రయుబట్టి
తిరుపీదులనుతిరిగి ♦ శ్రీరఘనాథయు
ధరణిలోసాతాని ♦ ధన్యులెవ్వరుజేసె. వి. 56

గీ. తల్లిగర్భములోను ♦ పిల్లసచ్చుండెను
పిల్లనుదీయుటకు ♦ ప్రేమతోను
అల్లుగట్లనుబిలచి ♦ అస్త్రశస్త్రములిచ్చె. వి. 57

గీ. సానిబోగాలకు ♦ చక్కగాం మెడకును
కన్నెరకపురుషుకు కట్టెపుస్తి

గీ. పుస్తికట్టకముందు ♦ సానెబోగమొగ్గాదు. వి. 58
చక్రవర్తినిజేసె ♦ జగతిలోవిశ్వజ్ఞ
బ్రముక్కవిప్రునిజేసి ♦ మోదముగను
పెక్కుదేవతలనుచు ♦ ప్రేమతోశిలలను. వి. 59

గీ. తొంటకాలువాను ♦ కుంటుతూపచ్చెను
ముంతబట్టితాను ♦ ముష్టికొచ్చె
ముంతలోముట్టేసి ♦ మోనముతోమ్రొక్కెదరు. వి.

గీ. మానంబుగాచుట ♦ మహిమీద దేవాంగి
ప్రాణంబుగాచుట ♦ ప్రాజ్ఞమయుడు
దానంబొసంగుట ♦ ధరణిలోవిశ్వజ్ఞ. వి. 61

గీ. జలము వేటకులకు ♦ వలగేలములునిచ్చి
వనము వేటకులకు ♦ వడిలుపాకి
జనని వేటకులకు ♦ జయపోటకత్తిచ్చె. వి. 62

గీ. దొమ్మరివాళ్లకు ♦ డోలాకటిబిరుదిచ్చి
బిరుదుబజాయించె ♦ భీకరమున
జనులువినుటకొరకు ♦ జయజేరివాయించె. వి. 63

సీ. సానిబోగాలకు ♦ సకలువిద్యలుజెప్పి
సంగీతసాహిత్య ♦ సరసముగను
ఆటలుపాటలు ♦ అభినయుదర్పణ
నవరసశికత్వ ♦ నాట్యముగను
గచ్చులుగమజాలు ♦ ఘనమైనమైఝుకి
ముఖముననవరస ♦ ముద్దుగుల్క

నుదెలతాళాలు • మరిగజ్జెలనుగట్టి
ఘల్లుఘల్లునమ్రోయు • ఘనులుమెచ్చ
యిట్లువిద్యలుసల్పుచు • నుండువేళ
ముందుగావిశ్వకర్మకు • వందనంబు
వెనుకసభవారిఅందరికి • వేడ్కతోను. వి. 64

గీ. కన్నపుదొంగకు కన్నకత్తిచ్చియు
తిన్నగా డతుమన • దీవినిచ్చె
తిన్నదప్పితెచ్చిన్న • తీసిబొండేతురు. వి. 65

గీ. వృత్తిచేసెడివేళ • భక్తిచేదండంబు
పెట్టకశాయుల • ప్రేమతోను
వృత్తులకునుపకరణ • మిచ్చినవారికి. వి. 66

గీ. లజ్జవిడచిసాని • గజ్జలుగట్టుకుని
ముందుగా మద్దెలకు • మ్రొక్కసాగె
తరువాత దండంబు • తక్కినప్రజలకు. వి. 67

గీ. తురకలకును పీర్ల • పంజాగనిర్మించి
పీర్లనుజేసిచ్చె • ప్రేమతోను
లాలుపోసుచును • లాలింతెంబుగనిచ్చె. వి. 68

గీ. రాతిమానుబల్ల • రజకునకునునిచ్చి

మయులబట్లులుతికి ♦ మానవులకు
చలయుజేయుకొలకు ♦ చాకలగాజేసి. వి. 69

గీ. తురకసాయిబులను ♦ దూదేకులను జేసి
కమాందస్తానిచ్చె ♦ క్రమముతోడ
బ్రతుకుదెరవుకొరకు ♦ బాకాసానాయిచ్చె. వి. 70

గీ. సాయులవానికి ♦ చక్కనిడమృగము
శకునాలపుస్తకము ♦ శ్రీరామకథయు
పులుతోలుసంచియు ♦ భుక్తికోసరమొసగె. వి. 71

గీ. బండకత్తెకడియాలు ♦ బండవానికినిచ్చి
నెత్తికోసుకబ్రతుకు ♦ నిత్యముగను
నెత్తికోతవాళ్ళు ♦ వృత్తియునదియనుచు. వి. 72

గీ. పారగునపముతట్ట ♦ పరగనాయుధమిచ్చి
యుర్వితవ్వబ్రతుకు ♦ దెరవుటకును
యుర్వితవ్వినవాని ♦ నుప్పరగాజేసి వి. 73

గీ. మాదిగవాళ్లకు ♦ మర్దించెగూటంబు
ఆరికత్తియునిచ్చె ♦ అవనియందు
పాదరక్షలుకుట్టి ♦ ప్రజలకిచ్చుకబ్రతుకు వి. 74

గీ. పృథివిశెవుచంబాయె ♦, శెవుచంబుపృథ్వియాయె

పృథివిశెవిచంబులో ♦ అధిక మేది
శెపుచం లేకుంటే ♦ శలగిపంటలు లేవు. వి. 75

గీ. పేడరొచ్చుపంట ♦ పంటభూములోబోసి
గాదుకో నేనుసకల ♦ యెహ్యాములతో
యివ్యోకుపంట ♦ మహామేలుపంటనిదినిరి. వి. 76

గీ. మహినికంటు లేదు ♦ మదనగృహమునకు
చంటికంటు లేదు ♦ సహజముగను
జలముకంటు లేదు ♦ జలజాక్షిమోవికిని. వి. 77

గీ. పుష్పదింతపండు ♦ నోప్పైనబెల్లంబు
నేమిశుద్ధిజేసి ♦ రిలమిలోను
మడిగట్టిజనులంత ♦ మయలకూడెదినిరి. వి. 78

గీ. అగ్రవర్ణమనగా ♦ నెవరికిని చెల్లును
అగ్రమనగ ♦ చినననుటచెల్లు
అగ్రపూత్వతత్వ ♦ మది నెట్లనెరుగరు. వి. 79

గీ. తాంకట్టునగలొస్తె ♦ తగనినిందులసామ్ము
తానివ్వ లేడంత ♦ ధనికుడైన
విశ్వకర్మనుజూడ ♦ కిస్వగజాలగు. వి. 80

గీ. లక్కబంగారంబు ♦ రత్నముల్ ముత్యాలు

లెక్క దెలియరాదు ♦ ముఖ్యముగను
విశ్వకర్మనెరుగుయీ ♦ లెఖలన్నియు. వి. ౧

గీ. రాళ్ళుతీసుకవచ్చి ♦ రత్నముల్ జేయుటకు
సానబట్టి ♦ చాయలేరపరచి
నామరత్నములచే ♦ నవరత్నములునయ్యె. వి. 82

గీ. విశ్వకర్మయనగ ♦ విశ్వమంతయుజూడ
దృశ్యమైనదంత ♦ విశ్వకర్మ
విశ్వకర్మములేని ♦ దృశ్యంబు లేదురా వి. 83

గీ. మనువులోహసృష్టి ♦ మయుడుదారువుసృష్టి
త్వష్టతామ్రసృష్టి ♦ నిష్టపరుడు
శిల్పిశిలాసృష్టి ♦ చెన్నొందువిశ్వజ్ఞ
స్వర్ణకారసృష్టి ♦ నిర్ణయముగ. వి. 84

గీ. విశ్వకర్మసృష్టి ♦ యింతంతయనరాదు
విశ్వమెల్లదృశ్య ♦ మైనదంత
విశ్వమేలువాడు విశ్వజ్ఞుడొక్కడే వి. 85

గీ. విశ్వకర్మసృష్టి ♦ యిలలోను జేసిరి
బ్రతుకజేసిరిలు ♦ బ్రహ్మదులైన
విశ్వకర్మలేని ♦ విశ్వంబు లేదురా వి. 86

గీ. మాయలోనె బుట్టి ♦ మాయలోనె పెరిగి
మాయయందు దాను ♦ మగ్నుడయ్యె
మాయభ్రమయు లేని ♦ మఱికీర్తిఘనుడు నీవు వి. 88

గీ. పంచబ్రహ్మల సృష్టి ♦ పరులెవరు జెప్పలేరు
మించి వైనసుతుడు ♦ పపంచి పెట్టె
పంచబ్రహ్మలుగూడి ప్రపంచంబు పాలించె. వి. 92

గీ. ముట్టుకోకురా నన్ను ♦ అంటుకోకురా నన్ను
అవతలికినడువు ♦ మనిసగజుడుం
తొమ్మిదిముట్లుదిగి ♦ తొలగనొచ్చెబాపన్న. వి. 9

గీ. విశ్వకర్మమహిమ ♦ యిలలోను ప్రజలంగా
కానలేరుమదిని ♦ కనమలేదు
కశ్యపపుత్రుని ♦ కాకలుఖండించె. వి. 94

గీ. వడ్లవారింటను ♦ అన్నంబుదినరాదు
నీళ్లుత్రాగరాదు ♦ నిక్కముగను
వడ్లకూడెదినుట ♦ వసుధలోజనులంత. 95

గీ. కాశిలోమరణంబు ♦ కంశాలఅన్నంబు
యంతవారికిదొరుకు ♦ యింతెబలము
కాశివిశ్వేశ్వరుని ♦ కంశాలచెయలెదా. వి

గీ. రాళ్ళుకోసుక వచ్చి ♦ రమ్యముగ శిల్పియు
మూడుమూర్తులు జేసి ♦ ముఖ్యముగను
మూడుమూర్తులు అవి ♦ మూలమేజూడుడీ. వి. 97

గీ. మొదటజాతివాడు ♦ మోసంబు జేసెన
కడజాతివానిచే ♦ కట్టుమనియె
మధ్యజాతులన్ని ♦ మరియాద లేమాయె. వి. 98

గీ. నీతిమాలిననడత ♦ భూతలంబున నడచి
నీజాతితక్క ♦ నాజాతియొక్క
జాతులు వారొచ్చి ♦ నీతులన్నియు గనిరి. వి. 99

గీ. సకలభువనకర్త ♦ సర్వజ్ఞ విశ్వజ్ఞ
ప్రకటితనామముల్ ♦ లుత్పత్తి జేసె
కాదన్న వ్యాసుని ♦ కుడికరము ఖండించి వి. 100

గీ. విశ్వకర్మసృష్టి ♦ యింతంతయనరాదు
దృశ్యమపుటకొలకు ♦ తోచుబుద్ధి
లోచనంబులకు ప్రతి ♦ లోచనముసిర్మించి వి. 101

గీ. కాలపురుషుడనగ ♦ ఘనుడు విశ్వబ్రహ్మ
కాలమని పెట్టి ♦ ఘడియారమొనగె
యీలు కల్పిన బ్రహ్మ ♦ యింద్రాదసురలకు వి.102

గీ. అయిదుబ్రహ్మలచేత ♦ అయిదుబరులుదయించె
నాంధ్రగీర్వాణములు ♦ నమరజేసె
వేదశాస్త్రపురాణ♦మోదముతో సృష్టించె వి. 103

శ్లో. మనురూపంతిథిః ప్రోక్తం వారంచమయసంభవః
నక్షత్రం త్వష్టరూపంచ శిల్పియోగత్వైచ
విశ్వజ్ఞకరణంచైవ పంచాంగమధిదేవతా. 104

గీ. పుట్టుజాతులు రెండు ♦ భూమిమీదను జూడ
పోతుపెంటిగదా ♦ పొందుకొరకు
సకలజాతులలోను సతిపతులకుకర్త వి. 105

శ్లో. భూతకర్మ పితాకర్మ దాతకర్మ తథైవచ
గురుకర్మ పతేకర్మ షట్కర్మ విశ్వకర్మణః. 106

సీ. షణతిస్థాప ♦ సంకల్పసిద్ధుండు
విశ్వకర్మగాక ♦ నితరులెవరు
షణ్మతవిగ్రహ ♦ నిర్మాణములు జేసె
విశ్వకర్మగాక ♦ నితరులెవరు
షణ్మతముద్రలు సరిలిగానిర్మించ
విశ్వకర్మగాక ♦ నితరులౌన
షట్కర్మనిరతుడై ♦ సర్వజ్ఞవిశ్వజ్ఞ

విశ్వకర్మగాక ♦ నితరులౌన
యిట్లువిశ్వజ్ఞమహిమలు ♦ నెంచదరమె
మూడుమూర్తులదిగా ♦ మూలమితడె
ఖ్యాతికెక్కిన పంచముఖ ♦ బ్రహ్మయనగా. వి.107

గీ. పగటిరాత్రిలోను ♦ పతినతిలెవ్వరో
భావించిచెప్పుడీ ♦ భావమునను
భావించిచెప్పితే ♦ బహుళనిధానుఁడ్నగును వి. 108

గీ. లక్షణంబును నేను ♦ నేక్షణంబును నైన
దీక్షగానొకరు వీక్షింపలేదు
దీక్షగామాగురుక ♦ సాక్షమేలక్షణము. వి. 109

గీ. మోక్షమెట్టిదోచూడ ♦ సూక్ష్మరూపమునందు
దీక్షగా నొకగురు సాక్షిగాను
గురుకటాక్షము వచ్చు ♦ గుణమునిబ్బరముగ. వి.

గీ. తృణముమేరువునాయె ♦ మేరువుతృణమాయె
కణము చేతజనులు ♦ ఘనులునాయె
క్షణముమందికాదు ♦ జనులెల్లనసుకోసర. విశ్వ.

గీ. ఆత్మకంక్షుడైవ ♦ ఆధికులెవ్వరు లేరు
సూక్ష్మరూపమునందు ♦ సుందరుండు

సాక్షిసాధకముల ♦ నర్వజ్ఞుడై దెల్పు. విశ్వ. 111

గీ. నీటిమీాదనుబుటక ♦ రీతినున్నదిజగము
నీటిమీాదబుటక ♦ నెట్లుబుట్టె
ఆరీతినేసృష్టి ♦అవవిపైదృశ్యంబు. విశ్వ. 112

గీ. వర్రిప్రపంచంబు ♦ నెట్టుగానున్నట్లు
తొర్రి అధరపానం ♦ జుర్రిసట్లు
పిర్రకుకాటుక ♦ ప్రీతిచేపెట్టినట్టు. విశ్వ. 113

శ్లో. బ్రాహ్మణానాంచనేకత్వం భూసురాణాంసనేకత్వ
విప్రాదిసర్వవర్ణానాం యేకభాండాశనంతథా. 114

గీ. వక్కయుక్తిలోను ♦ వున్నదితత్వంబు
పెక్కుయుక్తులెల్ల ♦ పేలవంబు
చక్కగా ఓంకార ♦ ప్రణవంబుగన్నదె. విశ్వ. 115

గీ. ఆత్మయొక్కటికాద ♦ యఖిలఘుటములందు
రూపుపనులువేరు ♦ రూపిగాను
జీవిజీవినిజూచి ♦ చిత్రపడుటే మాయ. విశ్వ. 116

గీ. శుక్లశోణితములు ♦ విప్రమైనకాల
మెట్లుగానుండునో ♦ నట్లు బ్రతుకు
కాలగతినిచేత ♦ కష్టసుఖములువచ్చు. విశ్వ. 117

గీ. ఆత్మయెట్టిదోచూడ • అవయవంబులు లేవు
ప్రాణమెక్కడ • రూపుపలుకు లేదు
చాలునుండెకదా • సర్వమునిర్మించె. విశ్వ. 118

గీ. జ్ఞానమనగవేరె • కాననంబున లేదు
జ్ఞానమనగవేరె • నోరులేదు
దేహమంటునుగలము • తెలివిగాఁజూచితె. విశ్వ. 119

గీ. నాల్గుయుగములలోను • నయ మొప్పగాసృష్టి
దేవసృష్టిజేయు • దేవపతియు
దేవసృష్టికర్త • దేవతాబ్రాహ్మణులు. విశ్వ. 120

గీ. దివసురాత్రులు రెండు • దివస మొక్కటిజా
పక్షములను రెండు • నెలయునొకటి
అయనంబులు రెండు • ఆవివత్సర మొక్కటి. విశ్వ

గీ. స్థావరంబులునెల్ల • తలలుక్రిందుగనుంచి
తల్లక్రిందుగాను • తపసుజేసి
ఫలములు ఫలియించి • ప్రజలబ్రతికించుటకు. విశ్వ.

గీ. కనప్రుద్దినియుపశువు • అమృతంబునిచ్చియు
పాలుత్రాగిఫణియు • విషమునిచ్చు
కుక్కగంజిత్రాగి • గుణమైనగుణమిచ్చు. విశ్వ. 124

గీ. విప్రమాటలువిని • వివేకహీను
లప్పుదెలియక ప్రజలు • ఒప్పుకొనిరి
ఆపిత్రుదేవతలకు • పెంటకూడెట్టిరి. విశ్వ. 125
గీ. వేదశాస్త్రంబులు • యెంతచదివినగాని
ఆవిద్యయందు • ఆశలేదు
చాపలు బుట్టలు • చక్కగానల్లుదురు. విశ్వ. 126
గీ. రోటికిరోకలి •పోటువెయ్యనేమునను
సూటిగానిర్మించి • సృష్టికెల్ల
పూటపూటకుభుక్తి • భోజనంబెట్లొచ్చు. విశ్వ. 127
గీ. చెరుకురసమొసుచుటకు• చేతుకగానుగనిచ్చి
పరాత్పరుండిలెడు పాలనకను
ధరణిజనులకు • దారిద్ర్యముంబాపె. వి. 128
గీ. త్రాసునేసుయెత్తు • తకరాలుజెప్పను
తక్కెడపబ్బెత్తు • తరుగుజెప్ప
కాటాకుపావుశేరు • ఖండింబుగజెప్పు. వి. 129
గీ. కొళ్లునెన్నికళ్లు • రోకళ్ళు తిరగళ్ళు
నిర్మితంబుగజేయు • నెమ్మనమున
ఆశనములకనల • ఆధారకతనాయను. వి. 130

సీ. అశ్వంబు ప్రజకు • వశ్యంబు నౌటకు
కళ్యముల్ నిర్మించు • ఘనుఁడితండు
మదగజంబుకుచాల • మర్యాదగలుగుటకు
ఇంకుశము నిర్మించె • హరుఁడితండు
పరపురుషపరసతికి • భక్తిగలిగుండుటకు
శతమానమొసఁగిన • శంకరుండు
అవనీపతికి జనుల • కాజ్ఞమిచ్చుటకను
ముద్రిక నొసఁగిన • రుద్రుఁడితఁడు
యితనికన్నను దైవంబు • మెవరు భువిని
సకలలోకములకాధార • చక్రవర్తి ... ... ... 131

గీ. గునపమునకుదండం • గుణశీలుఁడైనను
పారకుదండంబు • భక్తితోను
గాఢాళికమునకు • ఘనులైన ప్రముక్కెదగు. వి. 132

గీ. యేకులరాట్నంబు యేకులోడికొట్టుకును వెశవ్రశీలకునిచ్చె
యేకులోడికిఁ బ్రతుకు • వెలదులకును
యేకులోకలిగతి • లోకనిందనుబడకు. వి. 133

గీ. జోడుజోడుగూర్చి • చోళ్యప్రపంచంబు
మూడులోకములోనర్చె • ముఖ్యముగను

మూడుమూర్తులకాది • మూలవిశ్వబ్రహ్మ. వి. 134

గీ ముక్కు చెవులుకుట్టి • ముందుకన్యను జేసి
శతమాన మొసగి సౌభాగ్యవతికి
గతిదప్పి పతిబోతె • వెధవరూపము జేసె. వి. 135

క. లోకములోనల్గురువులు
ప్రాకటముగవైయ్యకొయ్య • కాల్పుటకట్టిన్
ధారుణికంతటగురువగు
ధీరుడు శ్రీవిశ్వకర్మ • స్థిరముగ నెపుడున్. 136

గీ. సృష్టికర్తలహింస • బెట్టిపాతకులైరి
ముష్టికర్తలమీద • మోహముంచి
భ్రష్టులైపోయిరి • పాతకంబులు జేసి. వి. 137

సీ. కాశీప్రయాగలు • ఘనమైనక్షేత్రముల్
కాశినిర్మించిన ఘనుడుయితడు
ఈశాన్యభాగమున • శ్రీశైలమునమల్లి
ఖార్జునిర్మించి • కాశమూర్తి
ఆగ్నేయభాగమున • హారుడైనకాలహ
స్తీశ్వరుణినిర్మించి • కాశమూర్తి
సకలవిగ్రహములు • ప్రకటితంబుగదివ్య

క్షేత్రముల్ నిర్మించె•కాశీనమూర్తి
యిట్లు దేశాధిపతులకు యించు విూఁగ
తీర్థయాత్రలు సేవిస్తె•మోక్షమనియు
కాశిలోపలన్మృతిమైతే•ముక్తియనియు
కామహాత్యంబు చెప్పుట•నలవిగాదు. వి. 138

సీ. శివరాత్రినాయే•నిర్మలంపగలామె
నీశరాత్రిసందు•నిభుమయెవరు
నీశరాత్రిసందు•నిర్మలాకాశుండు. వి. 139

గీ. సూవిరంధ్రమునుంది•సూటిగాజూచితే
మేదినంతయుదాల్లో•మెలయుచుండె
నారీతినేఆత్మ•నఖిలజగములనుండు. వి. 140

గీ. ప్రత్యక్షదై వాంశము•పృథివ్యాపస్తేజో
-వాయురాకాశాది•చంద్రసూర్య
ఆదివిశ్వకర్మ•అష్టదైవంబులు. వి. 141

గీ. కనవుగోయుటకును•కొడవలినిర్మించె
పశువుమానవులకు•బ్రతుకుటకును
అనుమానప్రభువులకు•నాయుధంబులునిచ్చె. వి. 142

గీ. ప్రత్తిదూదాటకును•పత్తిరాట్నంసమర్చి

పరమేశ్వరుండితఁడు • పాలనకునుయుక్తి
కింతవాఁడుయుక్తి • గోపలేఁడు. వి. 144

గీ. విశ్వదేవుఁడనెడి • విశ్వమందుఁజూడ
విశ్వాన్సృజించిన • విశ్వకర్మ
విశ్వకర్మగాక యితరు • లెవరుగందురా. వి.

గీ. హీనజాతినిగలసి • విహితంబుజేసిన
హానిజేసునువాని • హీనబుద్ధి
హానిచెయ్యకమానఁడెంత • వారికైన. వి. 146

గీ. కలిమిగలిగినవాఁడు • కులముకుమొండఁడు
చెలిమిగలిగినవాఁడు • స్నేహితుండు
కలిమిలేములులేని • కడజాతితోసముడు వి. 147

గీ. పుట్టినప్పుడుబట్టె • పురిటిమైలనుచును
చచ్చినప్పుడుబట్టె • చావుమైల
మధ్యగజనులకు • మఱియెట్లవచ్చురా వి. 148

గీ. విశ్వకర్మకుమాళ్ళు • యుర్విపైజనులంత
దేములనిమ్రొక్కెదరు • దివ్యములను
వాహనంబునుంచి • వైభవంబుగమోసి వి. 149
యిట్టిశర్మకంటె • యేలోకమందును

నితర దైవంబులు • లేరు లేరు
సకలలోకంబులకు • సర్వజ్ఞుడీయాత్మ. వి. 150

గీ. పృథివిపై ప్రాణులకు • బ్రతుకు దెరవిచ్చిన
పంచముఖోత్కృవులు • సాలవకును
సకలజీవులకర్త • సర్వజ్ఞ విశ్వజ్ఞ. వి. 151

గీ. రాజయోగంజెప్పును • రాజిల్లుచుండును
బ్రహ్మజ్ఞానానంద • వార్ధిలోను
వాలలాను మునుండు • వర్ణాద్వయనుకృపను. వి 152

గీ. నీచజాతులు చాల • నెగడివిస్తారంబు
గొర్రెలుబర్రెలు • కోటివేలు
ఘనమైన మృగరాట్టు • ఘనసింహ మొక్కటే. వి 153

గీ. భుక్తిముక్తికొరకు • భూమిమన్నకొరకు
వాలముకగ్రుసిచ్చె • సూత్రహాజులు
విష్టపోషణకర్తయని • పల్కువేదములు వి. 154

సీ. పంచభూతములను • పంచైమతత్వములు
యెవరునిర్మించిరో • యెరుకలేదా
ఐదుగుణంబులు జేసి • అదిగపుపంబని
యెవరుగల్పించెరో • యెరుక లేదా

చెప్పుమన్న భాషలు ♦ సౌష్టి
విద్యలు యెవరు ♦ సిద్ధించిరో యెరుక లేదా
పంచలోహంబులను ♦ పదునెఱింగిన దాత
నంటు జేసిం దెవరో ♦ యెరుక లేదా
యిన్ని మహిమలుగలిగిన ♦ విశ్వకర్మ
మూడుమూర్తులకాదిగా ♦ మూలమిలను
ఖ్యాతిగాంచిన విశ్వజ్ఞ ♦ బ్రహ్మయితడు. వి. 155

గీ. ఆదివిశ్వకర్మ ♦ ఆవికారములు జేసె
మేదినిరాజులు ♦ మెచ్చినట్లు
యిటువంటిరాజార్కు ♦ మేయుగంబున లేదు. వి 156

గీ. గనవరె మెంటువారు ♦ ఘనమైనరాజులు
అప్పుడున్నరాజార్కు ♦ మవనిలోని లె
దేశాస్త్రపురాణ ♦ మోదముగవినురచె. వి 157

గీ. సత్య...చదివి ♦ సాధించు రాజులు
సావధానముగాను ♦ పరవసముగను
వేదశాస్త్రపురాణ ♦ మోదముగమ్రొంచి. వి [illegible]

గీ. గానము మెంటువారు ♦ ఘనమిచ్చి ధనమిచ్చె
అప్పుడున్నరాజార్కు ♦ మహిసియే లె

బొందిరూపంబెత్తి♦భూమిపైపీనుగుల
భుజియించు శివుడు♦పరమాత్మగాడా
సకలయోహ్యములను♦ప్రకటితంబుగగ్రను
అకటుగ్రానారగింపు♦హస్తముగను
యజ్ఞజన్మములెత్తి♦యద్విగ్గోయాయాత్మ
యేహ్యాభారము లేక♦యేలుచుంటి

గీ. వహ్నికెక్కినవాడు♦వరశనుడుండినా
వహ్నిచేతకులము♦వెలయుజగతి
వనములోనునుంచి♦మలయజమున్నట్టు. వి 164

గీ. కులములోననొకడు♦గుణహీనుడుండినా
కులముచెరచువాని♦గుణముచేత
వనములోనునొకటి♦వానరమున్నట్టు వి. 165

శ్లో. కర్తాకారకశ్చైవ ప్రేరితంఅమోవితం సుకృతంచ
స్మృతంచైవచత్వారసముభాగినః.

శ్లో. ప్రథమంశిల్పిదండంచ ద్వితీయంకర్తదండయోఃతృ
తీయంవైవదండంచ త్రిదండంమోక్షకారణాం. 167

# విశ్వకర్మచరిత్రాన్వయదీపిక.

## గద్య.

ఓం శ్రీమద్విరాట్ విశ్వబ్రాహ్మణపంచముఖో

ద్భవుండగు మయవంశసంభూతుండైన

తంఋకు నరసన్నాచార్యను పుత్ర

డుభద్రమూర్తిచేరచియించ

బడిన విశ్వకర్మచరిత్రా

న్వయదీపిక పద్యకా

వ్యం మొదటిఆశ్వాసం

సంపూర్ణం.



